# చండ్ర రాజేశ్వర రావు గారితో

# నా జ్ఞాపకాలు



# చండ్ర రాజేశ్వరరావుగారితో
# నా జ్ఞాపకాలు

చండ్ర సావిత్రీ దేవి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

My Memories with Chandra Rajeswara Rao - Chandra Savitri Devi

ప్రచురణ సంఖ్య : 2083

ప్రతులు : 1,000

తొలి ముద్రణ : ఫిబ్రవరి, 1998

వెల: రు.10-00

ప్రతులకు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్-29. ఫోన్: 597831

# ఇందులో...



★ ★ ★

# నా మాట

సి.ఆర్. గారు మరణానంతరం చాలామంది మిత్రులు సి.ఆర్.గారి వ్యక్తిగత అలవాట్లు, స్వభావం ఎలా ఉండేవని అడుగుతూండేవారు. ముఖ్యంగా ఆయన పోయినప్పటినుండి పెడవల్లి శ్రీరాములుగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని వారి జ్ఞాపకాలను మీరు వ్రాయాలని ఉత్సాహపరుస్తూ వచ్చారు. శారీరక అశక్తతవల్ల నేను రాయలేనంటే తాను సహాయపడతానని ప్రోత్సహించారు. శ్రీమతి శివరాణీదేవి ప్రేమ్‌చంద్ గూర్చి వ్రాసినట్లు మీరు కూడా వ్రాయాలని ఆ పుస్తకం గూడా తెచ్చి ఇచ్చారు. తదనంతరం ఈ పనిని చేపట్టాము. సి.ఆర్. గారి విప్లవ ప్రస్థానంలో విశిష్ట ఘట్టాలెన్నో ఉన్నాయి. వాటిలో నాకు గుర్తున్న కొన్ని మాత్రమే చెప్పగలిగాను. ఆయన వ్యక్తిత్వాన్ని గురించి మా అబ్బాయి జ్ఞాపకాలనూ చివర చేర్చాను.

మఖ్దూం భవన్,
హైదరాబాద్.
తేది: 24-12-1997

చంద్ర సావిత్రీ దేవి

# పరిచయ వాక్యాలు

శ్రీ చంద్ర రాజేశ్వరరావు గారిని "మీ స్వీయ చరిత్ర రాయగూడదా!" అని మిత్రులు, సహచరులు పదే పదే అడుగుతూ వుండేవారు. కాని ఏనాడూ దానికి ఆయన అంగీకరించలేదు. స్వీయ చరిత్రలో మనోగతాలు పూర్తిగా తెలుపరనీ నిజాలు అన్నీ చెప్పరనీ, ఆయన అభిప్రాయం.

అయితే కొన్ని ముఖ్యమైన ఘట్టాలను గురించిన "జ్ఞాపకాలు-అనుభవాలు" ఏవైనా రాయాలనే సంకల్పం ఆయనకు వుండేది. కాని అదీ జరగలేదు. మృత్యువు అంత త్వరగా వస్తుందని ఆయన ఊహించలేదు. అది దగ్గరలోనే వున్నదని గ్రహించిన తరువాత వీలునామాగా ప్రసిద్ధి చెందిన "చివరి లేఖ" ఆయన వ్రాసారు.

శ్రీ రాజేశ్వరరావుగారి వ్యక్తిత్వం బహుముఖమైనది; విప్లవ వ్యూహ నిర్మాతగా, గ్రామీణ పేదల ఉద్యమకారునిగా, సాయుధ పోరాట సేనానిగా, పార్టీ నిర్మాణ దక్షుడుగా ఆయన కీర్తి జగద్విదితం. కాని ఒక సామాజిక విప్లవకారునిగా సమాజంలో పాతుకొనిపోయిన కుల, మత ఆచారాలు, కట్టుబాట్ల పట్ల ఆయనకు గల నిశిత పరిశీలనా దృక్పథం, మత సంస్కర్తల జీవితంనుండి, సంఘ సంస్కరణ ఉద్యమాల నుండి ఆయన పొందే ప్రేరణ, ఉత్తేజం, మహిళల్లో జాగృతిని కల్గించాలనే తపన, ప్రజాకళలు, సంస్కృతి, సాహిత్యంపట్ల అభిమానం, భారతదేశ చరిత్ర గురించి ఆయనకు గల జిజ్ఞాస, ఆ రంగాలలో ఆయన చేసిన కృషి పూర్తిగా వెలుగులోకి రాలేదు.

శ్రీ రాజేశ్వరరావుగారి జీవితంలోని కొన్ని ముఖ్యమైన ఘట్టాలపై ఆయన మాటలలోనే కొంత సమాచారం; శ్రీ రావూరి భరద్వాజగారు, "సోషలిజం సిద్ధాంతం-ఆచరణ" పత్రికా సంపాదకులు, ఇంకా కొన్ని సోదర పార్టీల ప్రతినిధులకు యిచ్చిన ఇంటర్వ్యూలలోనూ మనకు లభ్యమవుతున్నది. కీర్తిశేషులు కంభంపాటి సీనియర్‌గారు, శ్రీ వై.వి. కృష్ణారావుగారు ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రకు సంబంధించిన కొన్ని వివరాలను ఆయననుండి సేకరించారు.

ఆయా సందర్భాలలో శ్రీ రాజేశ్వరరావుగారు చేసిన ప్రసంగాలు, వ్రాసిన వ్యాసాలలో కూడా ఆయన వ్యక్తిత్వఛాయలు, మనకు గోచరిస్తాయి. ముఖ్యంగా కీర్తిశేషులు మద్దుకూరి చంద్రశేఖరరావుగారి సంస్మరణ సభలో (విశాలాంధ్ర ఆవరణలో) ఆయన చేసిన ప్రసంగం కమ్యూనిస్టు ఉద్యమకారులకు చిరస్మరణీయమైనది. ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమం ఆవిర్భావం, వివిధ చారిత్రక దశలు, ఉజ్జ్వల ఘట్టాలు, ఒడుదుడుకులు, సాంస్కృతిక పునరుజ్జీవనంలో పార్టీ పాత్ర, సాహితీకారుల కృషి, పార్టీ నాయకుల ఆదర్శాలు, కమ్యూనిస్టు నీతి- ఇలా అన్ని అంశాలపై ఉద్యమ చరిత్రను సమీక్షించుతూ విశ్లేషణాత్మకంగా సాగింది ఆ ప్రసంగం.

శ్రీ రాజేశ్వరరావుగారిని గురించిన జ్ఞాపకాలు, ముఖ్యంగా తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో ఆయన పాత్ర, పార్టీ నిర్మాణ విస్తరణకు ఆయన చేసిన మహత్తర కృషిపై ఉభయ కమ్యూనిస్టు పార్టీల ప్రముఖులు శ్రీ ఇంద్రజిత్ గుప్తా, శ్రీ నంబూద్రిపాద్, శ్రీ సూర్జిత్, శ్రీ బర్ధన్, ఇంకా ఇతరులు వ్రాసిన వ్యాసాలు గతంలో న్యూఏజ్, విశాలాంధ్ర, కమ్యూనిజం తదితర పత్రికలలో వెలువడినాయి. పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్‌వారు వ్యాసాల సంకలనం ఒకటి తీసుకువచ్చారు.

శ్రీ రాజేశ్వరరావుగారి రాజకీయ వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటున్న తొలిదశలోనే - బందరు విద్యార్థి దశ- ఆయనలో సేవాభావం, త్యాగగుణం, అన్యాయాన్ని ఒంటరిగానైనా ఎదుర్కొనే గుండెధైర్యం కలబోసి వుండేవని ఆయన పాతమిత్రులు చెపుతూ వుండేవారు.

ఈ మూడు గుణాలు ఒకే వ్యక్తిలో ఉండటం అరుదు. బహుశా శ్రీ రాజేశ్వరరావుగారు కమ్యూనిస్టు పార్టీలో అత్యున్నత స్థానానికి ఎంపికయి సుదీర్ఘకాలం నిలవటానికి ఈ గుణగణాలు ఒక ప్రధాన కారణం కావచ్చు. రాజకీయవేత్తలలో సాధారణంగా కన్పించే 'నటన' ఆయన స్వభావానికి విరుద్ధం. చెప్పింది చేసే తత్వంగల మనిషి. తెలుసుకోవలసినది, నేర్చుకోవలసినది చాలా వుంది - అనేది ఆయన ఆలోచనా విధానం.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణులలో అత్యున్నత గౌరవం పొందిన అంతర్జాతీయతావాది. అయినా స్వస్థలం, సొంత ప్రజలతో కలసిపోయే 'సామాన్యుడు'. ఈ గడ్డపైన, ఈ ప్రజలతోనే గదా సోషలిజం నిర్మించవలసినది అనేది ఆయన కార్యవిధానం.

ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం తొలిదశలో ముఖ్యంగా 1934-41 కాలంలో ఎదుర్కొన్న సమస్యలు, నాటి అనుభవాలు, ఈనాటి తరంవారికి తెలియచెప్పాలనే ఉద్దేశ్యంతో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలనుండి సేకరించిన వ్యాసాలను 1975 'కమ్యూనిజం' స్వర్ణో త్సవ సంచికలోనూ, మరికొన్నింటిని ఆ తరువాతనూ వెలువరించాం. శ్రీ రాజేశ్వరరావుగారు వాటిని చదివి ముగ్ధులై న్యూఢిల్లీ నుండి ఒక కార్డు వ్రాస్తూ ఇంతటి అమూల్యమైన ముడిసరుకును సేకరించి మంచి పనిచేశారని ప్రశంసించారు. కాని ఆయన మాత్రం వ్రాయలేకపోయారు. కమ్యూనిస్టు పార్టీ తొలితరం నాయకులు, శ్రీ చంద్రంగారు, రాజేశ్వరరావు గారు వ్రాయని లోటు పూరించేది కాదు.

శ్రీమతి సావిత్రమ్మగారు, శ్రీ చంద్రశేఖర్ అజాద్‌గారు ఇప్పుడు శ్రీ రాజేశ్వరరావుగారి కుటుంబ జీవితంలోని కొన్ని ప్రధాన ఘట్టాలను, విశేషాలను "జ్ఞాపకాల" రూపంలో మన ముందుంచారు. "నిజాయితీకి నిలువుటద్దం"గా శ్రీ రాజేశ్వరరావుగారి వ్యక్తిత్వం ఆంధ్రప్రజల హృద యాలపై చెరగని ముద్ర వేసింది. దానికి ఈ చిన్నపుస్తకం ఒక చిరుకానుక.

శ్రీ అజాద్‌గారి మాటను కాదనలేక ఈ రెండు మాటలు వ్రాసే సాహసానికి పూనుకున్నాను.

విజయవాడ,
తేది: జనవరి 5, 1998

ఈడ్పుగంటి నాగేశ్వరరావు

# ముందుగా ఒకమాట

మా తండ్రిగారు చనిపోయినప్పటినుండి, మా తల్లిగారి ఆరోగ్యం క్షీణిస్తున్నకొలది; ఆయనను గురించి యీమెలో కదులాడుతున్న కొన్ని జ్ఞాపకాలను నలుగురికి తెలియపర్చాలన్న తపన ఎక్కువయింది. తనను చూడవచ్చిన వారితో పదే పదే, యిదే విషయాన్ని చెప్పతూ వచ్చింది. అనారోగ్యంతో స్వయంగా వ్రాయలేని అశక్తత మూలంగా "నేను చెపుతాను. మీరు వ్రాయండి" అంటూ గట్టిగా కోరుతూ వచ్చింది. తానుకూడా కనుమరుగయ్యేలోపల సి.ఆర్. గారిని గురించిన తనలోని జ్ఞాపకాలను పుస్తకరూపంలో చూడాలన్న, ఆకాంక్షను గాఢంగా వెల్లడించేది.

సీనియర్ కమ్యూనిష్టు నాయకులయిన శ్రీ పెడవల్లి శ్రీరాములుగారు వుత్సాహంగా యీ పనికి పూనుకున్నారు. అలుపు తీర్చుకుంటూ ఆమె 3, 4 రోజులు చెపుతూ వచ్చింది. శ్రీరాములుగారు నోట్ చేసుకున్నారు. ఆ తర్వాత ఆమె చెప్పిన అంశాలను ఒక క్రమంలో వుంచి, రచన చేయటం జరిగింది. ఆమెకు, దానిని చదివి వినిపించటం, నాతో సహా ముగ్గురం కలిసి, అవసరమనుకున్న కొద్దిపాటి సవరణలూ చేసాం. ఆ తర్వాత శ్రీరాములుగారు, నేనూ కలిసి తుది కాపీని తయారుచేసాం. ఇందులోని కొన్ని విషయాలు నాకు యిదివరలో, తెలిసినవే.

మధ్య, మధ్య మా తల్లిగారి అనారోగ్యం తీవ్రమవుతూ వుండటం, ఆమెకు సపర్యలు అందించటంలో నాకు తీరిక, ప్రశాంతత కొరవడి నందున, మా పని కుంటుపడుతూ వచ్చింది. రాజేశ్వరరావుగారి నాలుగో వర్ధంతికయినా పుస్తకం తీసుకరావాలనే సంకల్పంతో దీనిని మీముందు ఉంచుతున్నాం.

శ్రద్ధాభావంతో రచన చేయటానికి తోడ్పడిన శ్రీ పెడవల్లి శ్రీరాములుగారికి, అవకాశం కల్పించుకొని అర్థవంతమైన పరిచయ వాక్యాలు వ్రాసిన శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారికి, మా తల్లిగారి తరఫున, నా తరఫున హృదయపూర్వకమైన అభివందనాలు అందిస్తున్నాను.

మఖ్దూం భవన్, హైదరాబాద్. — భవదీయుడు

తేది: 24-12-1997 — చండ్ర చంద్రశేఖర అజాద్

# సి.ఆర్.ను గురించిన జ్ఞాపకాలు

చంద్ర రాజేశ్వరరావుగారి జన్మస్థలం దివి తాలూకాలోని మంగళాపురం గ్రామం (కృష్ణాజిల్లా). తండ్రి సుబ్బయ్యగారు గ్రామ పెత్తందార్లలో ఒకరు. తల్లి రంగమ్మ. తాతపేరు చంద్ర పిచ్చయ్య. నాయనమ్మ మహాలక్ష్మమ్మగారు. సుబ్బయ్యగారి సంతానంలో ఇద్దరు కొడుకులు. రామలింగయ్యగారి తర్వాత రాజేశ్వరరావుగారు 1914 జూన్ 6వ తేదీన పుట్టారు.

వీరి తోబుట్టువులలో పెద్దక్క అన్నపూర్ణమ్మగారిని నర్సరావుపేట తాలూకాలోని కమ్మవారి పాలెంలో ఇచ్చారు. చిన్నామె నీలకంఠేశ్వరమ్మ గారిని గ్రామంలోనే ఇచ్చారు. సి.ఆర్.గారి మేనమామలు మాలెంపాటి రంగయ్య, శ్రీరాములు నిమ్మగడ్డ గ్రామంలో ఉన్నారు. శ్రీరాములుగారు ఊరి మున్సబు. తల్లిగారు చిన్నప్పుడే 4 సంవత్సరాల వయసులో గతించారు. నాయనమ్మల సంరక్షణలో పెరిగారు.

మంగళాపురం గ్రామానికి సంబంధించిన కొన్ని విషయాలను ఇక్కడ చెప్పడం మంచిదనుకుంటాను. ఈ గ్రామం మొదటినుండి ఉన్నది గాదు. గ్రామంలోని వారు కూడా కమ్మకులంలోని ఒక తెగకు చెందినవారై ఉన్నారు. వీరి పూర్వీకులు చెంగల్పట్టు జిల్లా (తమిళనాడు) నుండి నెల్లూరు, గుంటూరుజిల్లాలకు వలసవచ్చి స్థిరపడ్డారట. అందుకని వీరిని దక్షిణాది కమ్మ అని పిలిచేవారు. వీరు మాత్రం తమకు తాముగా పెద్దకమ్మవారమని ఘనంగా పిలుచుకొనేవారు.

ఇతర కమ్మ కులస్థులతో వీరికి సంబంధాలు తక్కువ. ఇచ్చిపుచ్చుకోవటాలు ఉండేవి కావు. మేనరికాలు, కుండమార్పిడులు చేసుకుంటూ తమ ప్రత్యేకతను నిలబెట్టుకోవాలని, ఒంటరిజీవితం గడుపుతూ, "సంతృప్తి" పడుతుండేవారు. సి.ఆర్.గారి వివాహం నాతో జరగటం (మమ్మల్ని చిన్నకమ్మ అనేవారు) ఇందుకు మినహాయింపు. బహుశా మా వివాహమే మార్పుకు ప్రారంభమేమో!

కృష్ణాజిల్లాలోని చల్లపల్లి రాజా సంస్థానం ఆ రోజుల్లో పేరుమోసినదిగా ఉండేది. రాజాకూడా తానూ ఒక పెద్దకమ్మనని చెప్పుకునేవాడు. సంస్థానం దురాగతాలమీద ప్రజల్లో వస్తూన్న అసంతృప్తిని అడ్డుకోవాలంటే తనకు నమ్మకస్తులయినవారు కొందరు కావాలనుకున్నాడు. అప్పటికి గుంటూరు జిల్లాలో స్థిరపడి ఉన్న ఈ దక్షిణాది కమ్మవారిలో కొందరిని ప్రోత్సహించి తన సంస్థానానికి రప్పించుకున్నాడు. ఆ విధంగా అటవీప్రాంతంలోని మధ్యభాగంలో మంగళాపురం అనే గ్రామం ఏర్పడింది. గ్రామ నిర్మాణానికి గడ్డ ఎత్తిన తరువాత ఇప్పటికి ఐదారు తరాలు గడిచి ఉంటాయేమో!

చల్లపల్లి రాజా మరొక "తెలివిగల" పనికూడా చేసాడు. కృష్ణా ఆనకట్ట 1864లో ఏర్పడింది. అయినా మా ప్రాంతం మాగాణి కావడానికి ఇతరులకంటే 30 ఏళ్ళు ఆలస్యం జరిగింది. మాగాణి భూములు వచ్చి, రైతులకు స్థిరమైన ఆదాయాలు వస్తే, వారు మదించి పోతారట. జమీమీద తిరుగుబాటు చేయవచ్చుట. అలాటి దుష్టతలంపుతో రాజాగారు మా ప్రాంతానికి, కృష్ణనీరు రాకుండా అడ్డుకున్నాడు. వ్యవసాయ కూలీలకు బంజరులు ఇస్తే, వారు తెలివిమీరుతారని, పిలిచినపుడల్లా పనులకు రారని భూస్వాములు ఆలోచిస్తూంటారు. రాజాగారు తన స్థాయిలో రైతులను గురించి ఆ విధంగానే ఆలోచించారన్నమాట.

అయితే మంగళాపురం విషయంలో రాజాగారి పూర్వీకుల అంచనా తారుమారయ్యింది. తమకు ఎంతో అండగా ఉంటుందనుకొన్న ఆ మంగళాపురం గ్రామంలోనే ముందు ముందు "ఒక యువకుడు" బయలుదేరతాడని; గ్రామస్థులను, ఇతర గ్రామ ప్రజలను సమీకరించి సంస్థానం రద్దుకు పోరాటాలు నిర్వహిస్తాడని ఊహించి ఉండరు. ఆ తర్వాత జాతీయోద్యమం, అందులో ఒక తీవ్రమైన విభాగంగా ముందుకు వచ్చిన కమ్యూనిస్టు ఉద్యమ ఫలితంగా జమీందారీ విధానమే రద్దయింది. ఇప్పుడది గతకాలపు అవశేషంగా చరిత్రలో మాత్రమే లిఖించబడి ఉంది.

* * *

# సి.ఆర్. గారితో నా వివాహం

నా పుట్టిల్లు, కైకలూరు తాలూకాలోని చేవూరు అనే గ్రామం. మా తండ్రిగారు చిన్నతనంలోనే చనిపోవటం వలన మా మేనమామల వూరికి తీసికొని వచ్చారు (వెంట్రప్రగడ) మేనమామ కొసరాజు శేషయ్యగారు విద్యావంతులు. ఆ రోజుల్లోనే కలకత్తాలో బి.ఎ. చదివారు. కమ్యూనిస్టు రాజకీయాలలోనికి నేను కాలుమోపటానికి వారి ప్రభావమే ముఖ్యమైనది.

మా పెండ్లి ప్రయత్నాలకు అంకురార్పణ కొత్త పట్నం రాజకీయ పాఠశాల సందర్భంలో జరిగింది (1937, మే నెలలో). మా మేనమామ శేషయ్యగారు, గుంటూరు శారదానికేతనానికి నన్ను తీసుకుని వెళుతున్నట్లు ఇంటివద్ద చెప్పి, బెజవాడకు తీసుకుని వచ్చారు. అక్కడనుండి కొత్త పట్నం రాజకీయ పాఠశాలకు వెళ్తున్న వారితో కలిపి నన్ను రైలెక్కించిపోయారు. సి.ఆర్. గారు పాఠశాలలో మిలటరీ శిక్షణ ఇస్తుండేవారు.

ఒకరోజు సి.ఆర్.గారు నా వద్దకు వచ్చి, "మీరింకా పెండ్లి ఎందుకు చేసుకోలేదు" అని అడిగారు. "పెండ్లి చేసికొంటే స్వేచ్ఛ ఉండదని, సమాజంకొరకు పనిచేయాలని ఉన్నట్లుగా" చెప్పాను. "మనం సోషలిజం కోసం పనిచేస్తాం. అందులో ఎవరి స్వేచ్ఛ వారికి ఉంటుంది. మీరంగీకరిస్తే మనం పెండ్లి చేసుకుందాం" అని చెప్పారు. దీనిమీద నేను కొంత ఆలోచించుకొని చెపుతాను అన్నాను.

జులై నెలలో పెండ్లి చూపులకని తన మిత్రుడు మునిపల్లె రామారావుతో కలసి రాజేశ్వరరావుగారు వెంట్రప్రగడ వచ్చారు. బంధువులు, పెద్దలందరూ జోడీ బాగుంటుందని మురిసిపోయారు. వివాహం ఖాయమయ్యింది.

మంత్రాల పెళ్ళి కాకుండా దండలపెళ్ళిగా జరగాలని సి.ఆర్.గారు పట్టుపట్టారు. శేషయ్యగారు మా బంధువులందరికీ నచ్చచెప్పారు. పూలదండలోనే మంగళసూత్రం కూడా ఉంచుదామని సర్దిచెప్పారు.

1937 ఆగస్టు 11వ తేదీన మా పెండ్లి జరిగింది. కొత్త పద్ధతిలో జరుగుతున్న పెండ్లి అని ప్రచారమయినందున చుట్టుపట్ల గ్రామాలనుండి జనం కదలివచ్చారు. మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఆచార్యత్వం వహించారు.

మావాళ్ళు ముచ్చటపడి, పెండ్లికి పది సవర్ల గొలుసు చేయించారు. దానిలో మంగళసూత్రం బిగించి ఉన్న కారణంగా నా మెడలో వేయడానికి ససేమిరా అంగీకరించలేదు. ఉంగరాల మార్పిడి మాత్రం జరిగింది. కాని ఎలాంటి అవసరం ఏర్పడిందో ఆ తర్వాత దానిని అమ్మివేసుకున్నారు.

అయితే రహస్య జీవితకాలంలో మేము విశాఖపట్టణం డెన్‌లో ఉండగా, నా మెడలో మంగళసూత్రం లేకుంటే చుట్టుపక్కల వారిలో అపోహలు కలిగే ప్రమాదం ఏర్పడింది. అందుకని సి.ఆర్.గారు ఆ గొలుసును నా మెడలో వేయక తప్పలేదు. అదేమిటంటే, పార్టీ అవసరాలకోసం ఇలాంటి సవరణలు చేయడంలో తప్పు లేదని సమర్థించి చెప్పారు. ఆ గొలుసు మాత్రం నావద్ద అలానే ఉండిపోయింది. అందులో రాయిని మాత్రం తీసివేయించి ఎర్ర నక్షత్రాన్ని వేయించుకొన్నాను. సి.ఆర్ గారు చనిపోయిన తర్వాత దానిని మా దంపతుల జ్ఞాపకార్థంగా పార్టీకోసం కార్యదర్శి కామ్రేడ్ దాసరిగారి చేతిలో పెట్టాను.

మా పెండ్లి నాటికి రాజేశ్వరరావుగారు విశాఖపట్నంలో మెడిసిన్ రెండో సంవత్సరం చదువుతున్నారు. నాకు ఎప్పటినుండో శాంతినికేతనంలో (కలకత్తా) చదవాలని కోర్కె ఉండేది. అయితే మా విషయంలో రాష్ట్రపార్టీ ఒక నిర్ణయం చేసింది. హోల్‌టైమర్సుగా పనిచేయమని మమ్మల్ని కోరింది. పార్టీ నిర్ణయాన్ని శిరసావహించి ఉద్యమానికి అంకితమై పనిచేయడం ప్రారంభించాము.

* * *

# మంగళాపురం బంజరు పోరాటం - ఇతర అంశాలు

అప్పట్లో మంగళాపురం గ్రామానికి సంబంధించిన 3 వేల ఎకరాలలో, సగం పొలంమీద రాజాగారి యాజమాన్యం చలామణీ అవుతుండేది. ఇందులో 6,7 వందల ఎకరాలు స్వంత పొలమై వుండగా, మిగిలిన 6,7 వందల బంజర్లమీద కూడా సంస్థానం వారే పెత్తనం జేస్తుండేవారు. భూములలోనికి వచ్చారనే నెపంమీద గ్రామంలోని ముత్రాసులమీద (నాల్గువందల కుటుంబాలు) రకరకాల దౌర్జన్యాలు కొనసాగుతుండేవి.

సి.ఆర్. గారి నాయకత్వాన ప్రజలు ఒకరోజు అరకలు కట్టి బంజర్ల ఆక్రమణకు పూనుకొన్నారు. జమీందారు పోలీసులను పిలిపించి, లారీఛార్జీ చేయించాడు. నీలి వెంకటేశ్వరరావు అనే సర్కిల్ ఇన్‌స్పెక్టర్, గుర్రాలను పెట్టి తొక్కించాడు. సి.ఆర్. గారి వీపుమీద, కాళ్ళమీద గాయాలు అయినాయి. ఆ తర్వాత చాలారోజులు వాటితో బాధపడ్డారుకూడా.

ఈ సందర్భంలో పోలీసులు పెట్టిన కేసు విచారణకు బందరు కోర్టుకు హాజరయ్యేవారు మిగిలినవారిలాగే సి.ఆర్. గారు చద్దిఅన్నం కట్టించుకొని 15 మైళ్ళు నడిచిపోయేవారు. శిక్షలు వేసి రాజమండ్రి జైలుకు పంపించారు. సి.ఆర్ గారినికూడా "సి" క్లాస్ ఖైదీగా ఉంచి, బోడిగుండు చేయించారు.

ఇది తెలుసుకున్న మావారు, కుటుంబస్థాయినిబట్టి "ఏ" క్లాసు ఖైదీగా మార్పించుకోమనిజెప్పడానికి నన్ను జైలువద్దకు పంపించారు. ఈ మాట నేను అన్నానో, లేదో సి.ఆర్. గారు నామీద మండిపడ్డారు. "నీకేమైనా బుద్ధి ఉందా. పోరాటం నడుపుతూ, వారిని 'సి' క్లాసుకు

* మానవసేవ రాజకీయాలద్వారా సాధ్యమన్న నమ్మకంతోనే రాజకీయాలలో ప్రవేశించి జీవితం ప్రజాసేవకు అంకితం చేశాను. -గాంధీజీ

పంపి నేను 'ఏ' క్లాసుకు పోయేదా? ఇలాంటి బోడి సలహాలు ఇక ఎప్పుడూ ఇవ్వవద్దని" మందలించి పంపారు. 1941 ప్రాంతంలో ఈ పోరాటం జరిగినట్లు నాకు గుర్తు.

ఇంతకు ముందు బెనారస్‌లో రౌడీలతో జరిగిన ఘర్షణలో సి.ఆర్. గారి కుడిపెదవి పైభాగంలో గట్టిదెబ్బ తగలటం, ఆ గాయానికి ఏర్పడిన మచ్చ జీవితాంతం అలానే ఉండిపోయింది.

పెండ్లి అయిన కొత్తలో కొంతకాలంపాటు వెంట్రప్రగడలో ఉన్నాము. మద్దుకూరి చంద్రంగారిది కూడా అదే ఊరు. గ్రామంలో పార్టీని నిర్మించడానికి కృషిచేశారు.

నన్ను మొదటిసారిగా మా అత్తగారింటికి మంగళాపురం తీసుకువెళ్ళారు. బందరునుండి లక్ష్మీపురం వరకు బస్సులో వెళ్ళాము. అక్కడినుండి డొంకబాటన మంగళాపురం చేరటానికి $1\frac{1}{2}$ మైళ్ళు నీళ్ళ బురదను నడిపించుకు తీసుకపోయారు. ఆవిధంగా పోయిన మమ్ము చూసినవారంతా ఆశ్చర్యపడ్డారు. ఎవర్రా ఈ అమ్మాయి "రాజ్యం" (చిన్నతనంలో ఆయన్ను అలా పిలిచేవారు) అని అడిగినవారికి నాభార్య అని చెపుతూ వచ్చారు.

గ్రామాన్ని సంస్కరించడానికి ప్లానుకున్నాము. నేను ఇంటి ఇంటికి పోయి ప్రచారం చేసేదాన్ని. తాగుబోతులచేత (ఎక్కువగా కల్లుతాగుతుండేవారు) ప్రమాణాలు చేయించి తప్పినవారికి శిక్షలు వేసేవారు. యువజన సంఘం ఏర్పడింది. కోడిపందాలు, వగైరాలకు పోకుండా సంక్రాంతికి ఆటలపోటీలు పెట్టాము. రాజకీయ చైతన్యం కలిగించడానికి అనేక విధాలుగా కృషి చేసేవారం.

★ ★ ★

---

* సంఘర్షణలేని జీవితం నిరర్థకం. - నెహ్రూ

# రెండో ప్రపంచయుద్ధ కాలంలో

బొంబాయిలో జరిగిన రెండో పార్టీ మహాసభకు నేనూ వెళ్ళాను (1943). ప్రజానాట్యమండలి వారితో కలిసి పాటలు పాడాను. ఆ రోజుల్లో మహిళా ఉద్యమం, ప్రచారకార్యక్రమాలు చురుకుగా జరుగుతుండేవి. "స్త్రీల పాటలు" అనే పుస్తకం ప్రచురించబడింది. అందులోని ఒక పాటయొక్క పల్లవి నాకు ఈ నాటికీ గుర్తుంది. "వాసనలేనీ పూావు పూాసేమి ఫలము. చదువూాలేనీ చాన బ్రతికేమి ఫలము".

సి.ఆర్.గారు బొంబాయిలో నావద్ద నాలుగువందలు తీసుకొని బ్యాండ్ సెట్టు భాగాలు కొనుక్కొని వచ్చారు. వీటితో తరిఫీదు పొందిన వెంట్రప్రగడ దళం రైతుమహాసభలో ప్రత్యేక ఆకర్షణగా ప్రజలను ఆకట్టుకొంది.

1944 లో బెజవాడలో జరిగిన అఖిలభారత రైతుమహాసభ ఆంధ్ర దేశంలో గొప్ప ప్రజా సమీకరణ – కమ్యూనిస్టు ఉద్యమానికి గొప్ప ఊపునిచ్చింది. నేను కిచెన్ డిపార్టుమెంటులో బాధ్యత తీసుకున్నాను. ఆ సందర్భంలో సి.ఆర్.గారి కాలిలో జొన్నమోడు విరిగి చాలారోజులు బాధపడ్డారు. ఆ ప్రాంతమంతా జొన్నమోడులతో నిండి ఉండేది.

ఆ రోజులలో కమ్యూనిస్టులమీద కాంగ్రెసువారి దాడులు ఉధృతంగా జరుగుతుండేవి. బెజవాడలో రౌడీల దురాగతాలు విచ్చలవిడిగా సాగుతుండేవి.

ఒకరోజు రాష్ట్రపార్టీ ఆఫీసుమీద దాడికి సిద్ధమైనవారు పొరపాటున అదే ప్రాంతంలో ఉన్న జిల్లా ఆఫీసుమీద దాడి చేశారు. పేపరు చదువుకోవటానికని పోయి సమయానికి నేను ఆఫీసులో ఉండటం జరిగింది. ఈ వార్త తెలిసిన రాష్ట్రనాయకులు కర్రలు తీసుకొని ఘర్షణ స్థలానికి రావటం, అదే సమయానికి వచ్చిన పోలీసులు – వారిని అరెస్టు చేసి కేసులు పెట్టడం జరిగింది.

కేసునుండి తప్పించుకోవాలంటే, నామీద దాడి జరిగినట్లు నేను కోర్టులో సాక్ష్యం చెప్పాల్సివచ్చింది. ఒక ఆడపిల్ల కోర్టు కెక్కడానికి మావాళ్ళు సుతరామూ అంగీకరించలేదు. నాపని ఇరుకున పడింది. "నీకు వాళ్ళు కావాలో? నేను కావాలో తేల్చుకోమని" సి.ఆర్. గారు అల్టిమేటం ఇచ్చారు. తప్పించుకొనలేక పోయాను.

ఇద్దరం కలిసి సినిమాకు పోయింది ఒకే ఒకసారి. బెజవాడలో ఉండగా నా బలవంతంమీద ఒకసారి సినిమాకు వచ్చారు (దుర్గకళామందిరం). సినిమానుండి మేము బయటకు వచ్చేసరికి రౌడీలు సోడా సీసాలతో జనాన్ని తరుముతున్నారు. వెళ్ళకండీ అని నేను ఎంతగా బ్రతిమలాడినా వినిపించుకోకుండా జనం మధ్యకు దూకారు. సమయానికి రౌడీలు తప్పుకోవటం వలన ఘర్షణ ప్రమాదం తప్పింది. మేము కలిసి సినిమాకు వెళ్ళటం అదే మొదటిసారి, చివరిసారీ అయింది.

ఆ రోజుల్లో వ్యవసాయ కూలీలకు కార్తీకమాసంలో ధాన్యం అప్పుగా కొలవడం అనేది పార్టీ ఒక కార్యక్రమంగా తీసుకునేది. సి.ఆర్. గారింటికి వచ్చినప్పుడు – పురులు పగులగొట్టి ధాన్యం కొలిచేవారు. ఆ తరువాత ప్రజలు కూలీరూపంలో అప్పు తీర్చేవారు, తీర్చని వారిని అడిగేది లేదు.

ఆ రోజుల్లో కాంగ్రెసు రౌడీలు బొంబాయిలోని సెంట్రల్ కమిటీ ఆఫీసును తగులబెట్టారు. విరాళాలకని జోషిగారు వస్తే నా నగలు తీసి ఇవ్వటం జరిగింది.

ప్రసూతికి సంబంధించిన శాస్త్రీయ విషయాలు మహిళల్లో ప్రచారం చేయాల్సిన అవసరం, ఆరోజుల్లో ఎక్కువగా ఉండేది. దానిమీద ఒక పుస్తకం వ్రాయమని డాక్టరు అచ్చమాంబగారిని సి.ఆర్. గారు ప్రోత్సహించారు. ఆపని అయ్యేలా చూసే బాధ్యతను నాకప్పగించిపోయారు. నేను పదేపదే అచ్చమాంబగారిని హెచ్చరిస్తూ ఉండేదానిని. డాక్టరుగారు ఒకరోజు ఒక మేకను తెప్పించి దానిని కోసి అయా భాగాలను మాకు చూపించి, వివరించడం జరిగింది. ఈ సమయంలో ఆమెగారు వ్రాసిన "ప్రసూతి – శిశుపోషణ" అనే పుస్తకం బహుళ ప్రచారం పొందింది. నాల్గు అయిదు ముద్రణలు కూడా వెలువడ్డాయి.

---

* మన బాధలను మరిచిపోవడానికి మార్గం యితరుల బాధల నివృత్తికి కృషి చేయడమే. – గాంధీజీ

కృష్ణకాలువల మొగదలలో పెద్ద ఎత్తున ఒండ్రు పేరుకొనిపోయి, దిగువ భూములకు నీరందక పంటలు దెబ్బతింటున్నాయి. సకాలంలో పూడిక తీయటం సాధ్యం కాదని ఇంజనీర్లు అశక్తత వెల్లడించారు. అలాంటప్పుడు ప్రజలను సమీకరించి పనిపూర్తి చేయడానికి పార్టీ ముందుకు వచ్చింది.

మహిళా ఉద్యమకార్యకర్తలతోసహా పార్టీ నాయకులందరూ ఈ కార్యక్రమంలో నిమగ్నులయ్యారు. ఆసమయంలో నేను చీరె ఎగగట్టి మట్టితట్ట మోస్తూ ఉన్నది, పత్రికల్లో ఫోటో పడింది. సి.ఆర్. గారి పెద్దక్క అన్నపూర్ణమ్మగారు "ఇదేమిటిరా మరదలు చేత ఉప్పరిదానిలాగా తట్టలు మోయిస్తున్నావని" తమ్ముడిని నిలవేసింది. "మట్టితట్టలు మోయకపోతే నోట్లోకి వేళ్ళు ఎలా పోతాయి" అని సి.ఆర్. గారి జవాబు.

* * *

# రహస్య జీవితకాలంలో

1948 జనవరి 30 వ తేదీన గాంధీజీ హత్య జరిగినప్పుడు బెజవాడలో కమ్యూనిస్టులమీద అకస్మాత్తుగా పోలీసు దాడులు జరిగాయి. అప్పుడు సి.ఆర్.గారు ప్రజాశక్తినగర్ కాంటీన్‌లో ఉన్నారు. పోలీసులు చుట్టుముట్టినప్పుడు, చొక్కా విప్పివేసి, వంటవాడి పక్కలో మరొక వంటవాడిగా పండుకొని, తప్పించుకొన్నారు.

సి.ఆర్.గారు బుద్ధవరంలో ఉండగా ఒక సంఘటన జరిగింది. ఒక రెల్లుపొద ప్రక్కన కూర్చొని, వెన్నెట్లో చదువుకొంటున్నారు. ఒక పాము వచ్చి, పడగవిప్పి నిలబడి ఉండటం అకస్మాత్తుగా చూసారట. గాభరా పడకుండా నిదానంగా జరిగి, జరిగి, పరారు అయినారట. ఆ కారణంగా తోటి కామ్రేడ్సుతో కాంటాక్టుపోయి మూడురోజులయిందట. చివరకు చలసాని వాసుదేవరావుగారి డెన్‌లోకి చేరటం, ఆయన కాచి ఇచ్చిన అన్నం గంజి త్రాగి ప్రాణాన్ని కుదుట పరచుకున్నారట. అప్పట్లో కృష్ణపిళ్ళై (కేరళ కమ్యూనిస్టు నాయకుడు) పాముకాటుకు గురియై చనిపోయిన వార్త వినిఉండటంతో మేము మరింతగా, గాభరా పడ్డాము. ఎలాంటి పరిస్థితులలోను ధైర్యంగా ఉండాలని, సమయస్ఫూర్తితో వ్యవహరించాలని మాతో చెప్పారు.

సి.ఆర్.తో సహా నల్గురు కేంద్రనాయకులు రహస్యంగా మాస్కో వెళ్ళినప్పుడు ఈయన నాతో చెప్పలేదు. తెలిసిన తరువాత గాభరా చెందుతూ వచ్చాను. నంబూద్రి పాద్‌గారు వస్తే, అదుర్దాతో అడిగాను. "They are safe" అని చెప్పారు. వెళ్ళేటప్పుడు సి.ఆర్.గారు బక్కగా ఉన్నారు. వాంతులు వస్తూండేవి. అయితే అక్కడనుండి బలంగా తిరిగి వచ్చారు. రష్యాలో బాగా స్వస్థత చేకూర్చి పంపారు.

---

* అధ్యయనం చేయడం ఎలానో మనకు తెలిస్తే ప్రతి ఒక్కడిని గురించి ఒక్కొక్క గ్రంధం అవుతుంది. - ఒక సూక్తి

ఆ రోజులలో నన్ను అన్నం వండిపెట్టడానికని రాష్ట్రపార్టీ డెన్‌కు పిలిపించారు (రాజమండ్రి). ఆ తరువాత విశాఖపట్టణం డెన్‌కు ఓమారు, కలకత్తాలోని కేంద్రకమిటీ డెన్‌కు వెళ్ళాను. ఈ సందర్భంలో కేంద్ర నాయకులందరితో దగ్గరి పరిచయాలు ఏర్పడటం మూలంగా నాకు సంతృప్తికరమైన అనుభూతి కల్గుతుండేది.

కలకత్తా డెన్‌లో ఉండగా ఎన్.కె. కృష్ణన్ – పార్వతిగార్ల కుమార్తె పుట్టినరోజు పండుగ చేసుకున్నాం. నా దగ్గర ఏడు రూ. మాత్రం ఉన్నాయి. 5 రూ. పెట్టి గౌనుగుడ్డ, 2 రూ. తో పాయసం చేసుకున్నాము. కష్టాలు పడుతున్న సమయంలో కామ్రేడ్స్ మధ్య పరస్పర సహాయం, ఆప్యాయతలు బాధలను తగ్గించుతాయి. పార్వతి కుమార్తె ఈ నాటికీ లండన్‌నుండి లేఖలు రాస్తూ ఉంటుంది. ఆ నాటి ఆప్యాయతలు అలా ఉండేవి.

★ ★ ★

# ఇంటి విషయాలలో...

1939 ఫిబ్రవరి 17 వ తేదీన మా కొడుకు – చంద్రశేఖర అజాద్ పుట్టాడు. మా వద్ద ఉంటే వాడి చదువు సంధ్యలు సరిగా సాగటం లేదు. నన్ను పెంచిన మామేనమామ సూర్యనారాయణగారు మద్రాసులో ఉంటున్నాడు. పిల్లవాడిని తీసుకవెళ్తానంటే, సి.ఆర్.గారు ఒక అనుమానం వెల్లడించారు. వాడిని మామూలు స్కూళ్ళలోనే చేర్పించమన్నారు. హైక్లాసు వాటిలో చేర్చి చదివిస్తే, వాళ్ళ అమ్మ ఎప్పుడయినా వెళితే "మా పనిమనిషి" అనే వాతావరణంలో ఉంచవద్దని చెప్పారు.

మద్రాసులో ఆ రోజుల్లో కాలేజి సీటు దొరకాలంటే $14\frac{1}{2}$ సంవత్సరాలు ఉండాలి. మేము డి.ఇ.వో. దగ్గరకు వెళ్ళినప్పుడు మా వాడికి 14 ఏళ్ళని చెప్పినందున సీటు లభించలేదు. "స్వంతానికి ఇలా చేస్తే నేను అందరి తరపున న్యాయంగా ఎలా వ్యవహరించగలను?" అన్నారు.

మద్రాసులో ఉన్నపుడు అజాద్‌కు ఒకసారి బాగా జబ్బుచేసింది. స్టాన్లీ హాస్పిటల్‌లో చేర్పించాం. ఒకరాత్రికి వాడిదగ్గర ఉండాల్సిన ఈయనగారు పార్టీపనిమీద పడి, వాడిసంగతి పట్టించుకోలేదు. తెల్లవారేసరికి వాడి స్థితి బాగా విషమించింది. ఆ డాక్టరు సి.ఆర్. గారి సహాధ్యాయి అయినందున (డాక్టరు చలపతినాయుడుగారు) చనువుతో ఈయనను మందలించారు. "కర్రలు పట్టుకొని బజారులవెంట తిరగడం అనుకున్నావా?" అన్నారు. దానికి ఈయన "అవతల నలభైకోట్లమంది భారతీయులు గదా" అని సర్ది చెప్పాల్సి వచ్చింది.

1941 మేలో మా రెండోవాడు పుట్టి చనిపోయాడు. బాధాకరమైన దిగులుతో ఉయ్యూరు సి.బి.ఎమ్. హాస్పిటల్‌లో నేను ఉన్నాను. సి.ఆర్.గారు అప్పుడు బొంబాయిలో రహస్యంగా ఉంటున్నారు. సంగతి తెలిసి హాస్పిటల్‌కు రహస్యంగా వచ్చారు. వస్తే అరెస్టు చేద్దామని

పోలీసులు ముందువైపు కాచుకొని ఉన్నారు. సి.ఆర్.గారు వెనుకవైపున ఉన్న ఇనుపవలగుండా రంధ్రం చేసుకొని నాగదికి వచ్చారు. "ఈ పిల్లవాడు పోతేనేమి, మరొకరు వస్తారు. ఏడవటం పిరికితనం. ధైర్యంగా ఉండమని" అంటూ ఓదార్చిపోయారు.

వీరి పెద్దక్క అన్నపూర్ణమ్మగారికి మద్రాసులో పెద్ద ఆపరేషను జరిగింది. ఆమె తమ్ముడికి దండంపెట్టి తన దగ్గర ఉండమని బ్రతిమలాడింది. ఆపరేషన్ రోజుమాత్రం ఉండి మర్నాడు సి.ఆర్.గారు వెళ్ళిపోయారు. ఆ తరువాత ఆమె చనిపోయిందనుకోండి.

అలాగే మేము ఢిల్లీలో ఉండగా సి.ఆర్. అన్నగారైన రామలింగయ్యగారు చనిపోయినట్లు ఆయనకు టెలిగ్రాం వచ్చింది. అప్పుడు జాతీయ సమితి సమావేశం ఉంది. ఈ వార్త నాకు తెలియజేయనీయలేదు. అయిదవరోజు తెలిసి హడావిడిగా బయలుదేరి మంగళాపురం వెళ్ళాను. పనివత్తిడి మూలంగా ఆయనమాత్రం సంతాపసభకు వచ్చి వెళ్ళారు.

మేము ఢిల్లీలో విండ్సర్ ప్లేస్‌లో ఉండగా, నాకు గుండెనొప్పి వచ్చింది. సి.ఆర్.గారు అప్పుడు పంజాబ్ టూర్‌లో ఉండి "ఆమెను పెద్ద హాస్పిటల్‌లో కాకుండా మామూలు ఆస్పత్రిలో చేర్పించమని" ఆఫీసుకు టెలిగ్రాం ఇచ్చారట. నన్ను గోవిందవల్లభ పంత్ హాస్పిటల్‌లో చేర్పించారు – అదీ సిఫార్సుమీద.

1984లో నా కళ్ళకు గ్లాకోమా వచ్చి, ఆపరేషన్ చేయాల్సివచ్చింది. గంగారామ్ హాస్పిటల్‌లో చేర్పించారు. సిఫార్సు మూలంగా గది అద్దె 5 వందల నుండి 2 వందలకు తగ్గించారు.

మా పెండ్లి సందర్భంలో, మావారి ఆచారం ప్రకారం అల్లుడికి వెండి కంచం, వెండి గ్లాసు చదివిస్తే వాటిని ఎప్పుడూ వాడిందిలేదు. రాజస్థాన్ మిత్రులు, వారు స్వయంగా నేసిన ఒక చీరెను నా కొరకని కానుకగా ఈయనద్వారా పంపించారట. ఆ తర్వాత ఆమిత్రులు నన్ను కలిసినప్పుడు "చీరె ఎలా ఉంది" అని అడిగితే బిత్తరపోవడం నాపని అయింది. "నాకు తెలియదు. వారినే అడగండి" అని సమాధానం చెప్పాల్సి వచ్చింది.

నన్ను పెంచిన మా మేనమామ సూర్యనారాయణగారు 27–2–54 తేదీన నాకు వ్రాసిన ఒక సంగతి నిజమని రుజువయ్యింది. "అతడి మొదటి భార్య ఆయన పార్టీ. నీవు రెండు. అందువలన ఆయన

బాధ్యతలు ఇద్దరిమీద ఉన్నవి. అయన ఇష్టప్రకారం చేసుకోనివ్వు". ఆ రోజులలో అయన నా పరిస్థితిని గమనించి తరచుగా ఓదారుస్తూ ఉండేవారు.

అవి రహస్యదినాలు. మా కుమారుడు అజాద్‌ను మీ దగ్గర ఉంచుకొని, చదివించమని సి.అర్. తండ్రిగారిని నేను కోరడం జరిగింది. అందుకు ఆయన అంగీకరించలేదు. దీనిమీదట ఎలాగైనా మన భాగం పంచుకురమ్మని సి.అర్.గారు నన్ను పంపించారు. నేను చేలో అరకలకు అడ్డంపడి గ్రామంలోని ముత్రాసుల అండతో ఆస్తిలో వాటా సంపాదించుకోగల్గాను. ఈ విషయంలో మా చిన్న ఆడబిడ్డ కుటుంబం మాకు తోడ్పడింది.

గతంలో మా మామగారు జమీందారుకు 60 వేలు అప్పు పెట్టారట. అప్పుక్రింద 200 ఎకరాలు తీసుకొమ్మని రాజాగారు కబురు పంపారు. స్వంతభూములన్న పేరుతో రాజాగారు చేస్తున్న అక్రమ అమ్మకాలను రైతులు వ్యతిరేకిస్తున్న కాలమది. సి.అర్.గారు బహిరంగంగా తండ్రిని వ్యతిరేకించడానికి సిద్ధమైన తరువాత ఆ మార్పిడి ఆగిపోయింది. తమ కుటుంబం వద్దనున్న ప్రామిసరీనోట్లలో పేదవారివి, తీర్చలేరనుకున్నవారి నోట్లను సి.అర్.గారు చించివేశారు.

అవసానదశలో మా మామగారికి ఒక బెంగ పట్టుకొంది. "నా శవాన్ని ఏ అలగావాడో లాగిపారేస్తాడు. వీడుమాత్రం రాడ"ని అంటుండేవారు. ఆ సమయానికి తప్పక సి.అర్.గారిని పిలిపిస్తానని వాగ్దానం చేశాను. ఆ వాగ్దానం నెరవేర్చబడింది.

తండ్రిగారు చనిపోయినప్పుడు అయన విశాఖపట్టణం వచ్చియున్నారు. మంగళాపురానికి పిలిపించాం. మిగిలిన కర్మకాండలు చేయలేదుగాని, ముఖ్యమనుకొన్న "అగ్నిసంస్కారం" స్వయంగా నిర్వహించారు. ఆచారప్రకారం మా ఇద్దరికి బట్టలు తెచ్చారు. అందులోని తుండుగుడ్డ మాత్రం తీసుకొని, నాతో చెప్పకుండా వెళ్ళిపోయారు.

తరచుగా ఏవైనా విందు పార్టీలకుగాని, ఇతరదేశాల యాత్రలకు వెళ్ళేటప్పుడుగానీ నన్ను వెంటతీసుకు వెళ్ళేవారుకాదు. ఇందుకు కారణం మరేమీలేదు. ఆయనకు ఆడంబరాలన్నా, అందుకయే ఖర్చులన్నా ఇష్టం ఉండదు. తానుగా ప్రదర్శించుకోవడం అసలు ఇష్టముండదు.

అయితే బల్గేరియా పర్యటనలోమాత్రం నన్ను వెంట తీసుకుపోయారు. అదికూడా ఆ దేశాధ్యక్షుడు గట్టిగా కోరినందున తప్పనిసరి అయింది. డిమిట్రావ్ అవార్డు సి.ఆర్.గారికి బహూకరించే సందర్భంలో ఈ యాత్ర జరిగింది. ఆ పర్యటన సందర్భంలో మేము నల్లసముద్రతీరంలో విశ్రాంతి తీసుకుంటున్నాము. మాతో ఉన్న ఇంటర్ ప్రెటరు నాఎడల ఆయన వైఖరిని విమర్శిస్తూ గట్టిగా వాదించింది. అప్పుడు ఆయన తన కర్చీఫ్‌తో నా తడికాళ్ళను తుడుస్తూ, "See! How I love my wife and treat her". అంటూ చమత్కరించారు.

బల్గేరియా టూర్ సమయంలో మా అజాద్‌నుకూడా తీసుకువెళ్ళా. అక్కడ 2 వారాల పర్యటన ముగించుకొని సి.ఆర్.గారు ఇండియాకు రావాల్సి ఉంది. వైద్యచికిత్స నిమిత్తం బల్గేరియానుండి నేను మాస్కోకు వెళ్ళాలి. ఆ కారణంగా నాకు తోడుగా ఉండటానికి అజాద్ వచ్చాడు. అయితే పంజాబులో అకస్మాత్తుగా లోంగో వాలా హత్య జరగటంవలన సి.ఆర్.గారు బల్గేరియా టూర్‌ను అయిదు ఆరు రోజులకే విరమించుకొని స్వదేశానికి రావటం జరిగింది.

కుటుంబానికి సంబంధించిన విషయాలలో సి.ఆర్.గారి ఆలోచనలు స్వభావాన్ని అవగాహన చేసుకుంటానికి ఢిల్లీనుండి వారు వ్రాసిన రెండు లేఖలను దిగువ ఉదహరిస్తున్నాను.

ఢిల్లీ<br>ది: 2-12-1971

సావిత్రమ్మకు,

నీ రెండు కార్డులు, ఇన్లండు కవరు చేరినవి. నా ప్రోగ్రాము నిర్ణయమైన తర్వాత సమాధానం వ్రాద్దామనుకుంటూ అశ్రద్ధచేశాను. నీ ఉత్తరాలద్వారా తెలిసిన విషయాలు నాకు ఎంతో సంతోషాన్ని కలుగజేసినవి. రెండవ చిట్టిబాబును చూడాలని నాకు ఎంతో కుతూహలంగా ఉంది. మొదటి చిట్టిబాబు మీద గూడ నాకు మనాదిగా ఉంది. ఎప్పుడు వీలైతే అప్పుడు తప్పక వస్తాను.

యుద్ధప్రమాదం ఎక్కువ అయింది. అట్టి పరిస్థితులలో నేను ఇక్కడినుండి కదల వీలుండదు. బహుశా యుద్ధ ప్రమాదానికి గురైన సరిహద్దు రాష్ట్రాలకు వెళ్ళాలిసి ఉంటుంది. కొద్దిరోజుల తర్వాత ఏ

విషయమూ తెలియజేస్తాను. ఇద్దరు చిట్టిబాబులకు నా ప్రేమాభిమానాలు అందజేయవలెను.

మీ అమ్మ అవసానదశలో ఉన్నప్పుడు మనం ఆమెను సాధ్యమైనంతవరకు ప్రశాంతంగా ఉంచడం అవసరం.

చంద్ర రాజేశ్వరరావు

ఢిల్లీ
ది: 4-2-1972

ప్రియమైన సావిత్రీదేవికి,

నేను ఆరోగ్యంగానే ఉన్నాను. అయితే నీ ఆరోగ్యం విషయాన్ని గూర్చి నాకు ఎంతో ఆవేదనగా ఉంది. నా పార్టీ బాధ్యతల వల్ల మీ అమ్మను గూర్చిన బాధ్యత అంతా నీమీద పడింది. ఆమెకు మనోనిబ్బరం లేనందున ఎక్కువ అవస్థ పెడుతుంది. అయితే ముసలితనం అనేది మహా కష్టమయింది. ఎంతో చైతన్యం కలిగి ఉంటేగాని, ముదుసలితనంలో ఇతరులకు ఆటే కష్టం గలిగించకుండా ఉండటం జరగదు. అందుచేతనే ముసలి తనాన్ని ఇంగ్లీషులో రెండవ బాల్యదశ అంటారు. మనకు ఇతర ఇబ్బందులు లేకపోతే ఆమెను విజయవాడలోనే ఉంచడం మంచిదని నా అభిప్రాయం. ఆమె మనకు చాకిరీ చేసినా ముసలితనంలో నేను ఏమీ చేయలేక పోతున్నాననే మనోవ్యథ. నీమీద పడిన భారం వల్ల నీ అవస్థలు చూచి, నేను ఈ విషయం ముఖతా చెప్పలేక పోయాను.

ఈ మానసిక స్థితిలో గూడ మన చిట్టిబాబు రాజేశ్ నాకు ఎంతో సంతోషాన్ని కలుగజేశాడు. వాడు నన్ను వదిలిపెట్టకుండా వెంట తిరగడం, రాత్రిళ్ళు మనవద్ద ఉండటం నాకు ఎంతో ఉపశాంతి గలుగజేశాడు. మనమంటే వాడికి ఎంతో ప్రేమ. వాడు నా కళ్ళల్లో మసులుతున్నాడు. రెండవ చిట్టిబాబుగూడ నావంక తేరిపార చూచాడుగాని, గుర్తుపట్టడంలేదు.

నేను ఎన్నికల సందర్భంగా ఈ నెల 21 నుండి మార్చి 7,8 తారీఖులవరకు మన ప్రాంతంలోనే ఉంటాను అప్పుడు కొన్నిరోజులు విజయవాడలో మనబాబులతో కాలం గడపగలుగుతాను.

బాబు విషయం ఇంక అనుకున్నట్లు చేస్తాను. ఎన్నికలు అయిన తర్వాత మార్చిలో పనిలో ప్రవేశపెడతాను. ఆయన విషయంలో నీవేమీ అదుర్దా పడవద్దు. డాక్టరుగారితో ఈ విషయం చెప్పాను.

రేడియో లైసెన్సు డబ్బు కట్టాను. ఒక రూపాయి పెనాల్టీ పడింది. నేను అక్కడికి వచ్చేటప్పుడు లైసెన్సు తెస్తాను.

నీవు ఓర్పుతో ఉండు. అంతకన్న చేసేదిలేదు. ఓర్పుగోలుపోతే ఏమీ చేయలేము.

శేషయ్యగారికి నా కృతజ్ఞత తెలియజేయాలి. ఆఖరినిముషం వరకు పనివల్ల ఆయనతో ఆత్మీయంగా మాట్లాడలేకపోయాను.

చంద్ర రాజేశ్వరరావు

★ ★ ★

# త్యాగానికి మారుపేరుగా...

సి.ఆర్. గారి తండ్రిగారిది, మంగళాపురం గ్రామంలో ఒక భూస్వామ్యకుటుంబం. దాదాపు 150 ఎకరాలు ఉండేది. ఒక రైస్‌మిల్లు వేరుసెనగ పప్పుమిల్లులో వాటా కూడా ఉండేది. ఆ తరువాత వీరి వాటా 1,25,000 రూ॥కు అమ్మకం జరిగింది. దీనిని అన్నదమ్ములిద్దరూ పార్టీ అవసరాలకు ఖర్చు చేయడం జరిగింది. కుటుంబంలో తన వాటాక్రింద వచ్చిన భూమిని సి.ఆర్.గారు తఫతఫాలుగా పార్టీ అవసరాలకొరకు అమ్మివేస్తూ వచ్చారు.

దేశ, విదేశాలలో ఆఖరుకు తన బంధువుల వద్దనుండి వచ్చిన బహుమతులను సైతం అవసరాన్నిబట్టి తోటి కామ్రేడ్సుకుగాని, పార్టీకి గాని ఇచ్చివేసేవారు.

విదేశీ పర్యటనలో ఏవైనా బహుమతులు వస్తే పార్టీకి ఇచ్చేవారు. డబ్బు ఇస్తే దానిని మన కరెన్సీలోకి మార్చి పార్టీ నిధులకు జమ చేసేవారు.

ఢిల్లీలో ఉండగా ఈయనగారు ఉపయోగించుకుంటానికని తేజాసింగ్ స్వతంత్రగారు ఒక కారు ఇచ్చారు. మరొక పంజాబు కామ్రేడు జీపు ఇచ్చారు. మరొకరు టెలివిజన్ సెట్టు ఇచ్చారు. వీటన్నిటిని పార్టీకి ఇచ్చివేశారు. తెలుగు మహాసభలలో ఇచ్చిన బహుమతులను రాష్ట్రపార్టీకి ఇచ్చారు.

మా బంధువులు వీరికని ఇచ్చిన వాటిని వారి కళ్ళ ఎదుటనే ఇతరులకు ఇస్తుండేవారు. "అలాచేస్తే వారు చిన్నబుచ్చుకుంటారు. అలా చేయకండి" అని నేను చెపుతుండేదాన్ని. మా మద్రాసు మేనమామ ఖరీదయిన ఒక హోల్డాల్ కొని ఇస్తే దాన్ని జోషీగారికిచ్చారు. ఒక పార్కర్ పెన్ ఇస్తే దానిని గోళ్ళ రాధాకృష్ణమూర్తిగారికిచ్చారు.

ఆ మధ్య మా చుట్టాల ఇళ్ళలో వరుసగా పెండ్లిళ్ళు జరిగితే వీరికి 5 జతల బట్టలు పెట్టారు. వాటిని ఇటీవల విజయవాడ వచ్చినప్పుడు కామ్రేడ్స్ కిచ్చివేశారు. తనకు మాత్రం అవసరానికి సరిపడ్డ బట్టలుమాత్రమే ఉంచుకొనేవారు.

1955 ఎన్నికల్లో వీరు పోటీ చేసినప్పుడు మిత్రులు కొందరు కలిసి ఒక కారు కొని ఇచ్చారు. ఎన్నికలు అయిపోయిన తర్వాత ఆ కారును మనం ఉంచుకుందామనికోరాను. ఆయన అంగీకరించలేదు. డ్రైవరు పెట్రోలు వగైరాలు చూసుకుంటే ఎంతో ఖర్చు అవుతుందని చెపుతూ దానిని అమ్మివేశారు.

విజయవాడలో జరిగిన పార్టీ మహాసభ తర్వాత (1961) హైడ్రోసిల్ ఆపరేషన్ కొరకు ఉస్మానియాలోని స్పెషల్ వార్డులో చేర్పించాము. ఆయనను చూడటానికని షెడ్యూల్డ్‌కాస్ట్ ఫెడరేషన్ ప్రెసిడెంటు శ్రీ సుబ్బయ్యగారు వచ్చారు. మాటల సందర్భంలో ఆపరేషన్ జరిగిన ఆయన పిల్లవాడికి, స్పెషల్ వార్డులో సీటు దొరకలేదని తెలుసుకున్నారు. ఇంకేముంది? తాను జనరల్‌వార్డుకు మారి వారికి తమ గది ఇచ్చారు. అదేమని అడిగితే "నాకు ఆపరేషన్ జరిగి నాల్గు అయిదు రోజులు అయ్యిందిగదా" అని సంజాయిషీ చెప్పారు.

కమ్యూనిస్టు కుటుంబాలు అయినవారికి, స్థిరాస్తులు ఉంటే ఇబ్బందులు ఎదురవుతాయని, సంసారాన్ని బుట్టలోకి సర్దుకొని ఎక్కడికిబడితే అక్కడకు పోవడానికి సిద్ధంగా ఉండాలని చెపుతుండేవారు.

సూర్యారావుపేటలోని దేవరాజు తోట ఇరవైవేలకు చవుకగా వస్తుంది, కొందామంటే అడ్డుచెప్పారు. శ్రీ రావినారాయణరెడ్డిగారు ట్యాంక్‌బండువద్ద 800 గజాలు స్థలం కొంటూ అందులో 400 గజాలు తీసుకోమంటే నిరాకరించారు. అదేవిధంగా చిక్కడపల్లి సొసైటీలో ఒకప్లాటు ఇస్తామంటే వద్దన్నారు.

* * *

* సేవలో, త్యాగంలో మనిషికి ఆనందం, స్వేచ్ఛ లభిస్తాయి.

\- రవీంద్రనాథ్ టాగూర్

# అలవాట్లు - స్వభావం

పెండ్లి అయిన కొత్తలో మా ఇద్దరి ఆహారపు అలవాట్లు పరస్పరం భిన్నంగా ఉండేవి. కాఫీ టీలు తాగేవారు కాదు. వక్కపొడి వేసుకోరు. సబ్బుకూడా వాడేవారు కాదు. మొదట్లో వీటిని వాడకుండా మామీదకూడా ఆంక్షలు పెట్టేవారు. ఆ తరువాత మమ్మల్ని అనుమతించారు.

క్రమేణా వారిలోనూ కొంత మార్పు వచ్చింది. ఉదయం ఒక గ్లాసు పాలు తాగేవారు. స్వీట్లు వాడటం చాలా పరిమితం. నూనె వాడకాన్ని వీలున్నంతగా తగ్గించేవారు. ఇడ్లీలు, చపాతీలు ఇష్టంగా ఉండేవి.

మొదట్లో మామధ్య ఒక పేచీ నడుస్తూండేది. ఎవరికైన టవలు, సబ్బు ప్రత్యేకంగా ఉండాలని నేనంటే ఆయన సమిష్టిగా ఉండాలనే వారు. అలావాడుతుంటే చర్మవ్యాధులు ఒకరివి మరొకరికి వచ్చిన అనుభవం వారికికూడా వచ్చింది. "సావిత్రీ, నీమాటయే సరిఅయినదని" అంగీకరించారు.

సి.ఆర్.గారికి ఉబ్బసం చిన్నప్పటినుండి ఉండేదికాదు. 1948లో తెలంగాణా పోరాటం సందర్భంలో ఫారెస్టు లోతట్టు ప్రాంతాలలో, ఎక్కువగా చిత్తడినేల్లలో తిరగడం, నివాసంకూడా ఉండటం మూలంగా ఉబ్బసం లంకించుకుంది. జీవితాంతం దానితో ఇబ్బంది పడుతుండేవారు.

ఆసనాలు వేస్తూండేవారు. ఉబ్బసం ఉండటం వలన Breathing Exercises చేస్తూండేవారు. చీటికిమాటికి మందులు వాడే అలవాటు లేదు. అవసరమని భావించినప్పుడు ఆయుర్వేదం, చ్యవనప్రాశ లాంటివి వాడేవారు. ఏదైనా సుస్తీ చేసి ఇంటికి వచ్చినప్పుడు బొమికల సూపుపెట్టి ఇచ్చేదానిని. త్వరలో స్వస్థత చేకూరేది.

కుటుంబ అవసరాలకంటే పార్టీ అవసరాలనుగూర్చి ఎక్కడికక్కడ ఆలోచిస్తూ ఉండటం ఆయనకు అలవాటు. ప్రస్తుతం మఖ్దూం భవన్

ఉన్న స్థలం కాజ రామనాధంగారిది. స్థలంమీదనున్న పేచీలను తామే పరిచేసుకుంటామని చెప్పి, బేరంచేసి పార్టీ ఆఫీసుకు తీసుకున్నారు. బిల్డింగ్ నిర్మాణ బాధ్యత తమ్మారెడ్డి సత్యనారాయణగారికి అప్పగించారు. అలానే చల్లపల్లి పార్టీ ఆఫీసు బిల్డింగ్ అవసరానికి ధాన్యం అమ్మి డబ్బు ఇచ్చారు (రు.14,000).

హైదరాబాదు సిటీలోని నాగార్జునసాగర్ కాలనీ ఏర్పడటం ముఖ్యంగా ఆయన కృషి ఫలితమేనని చెప్పవచ్చు. పార్టీ హోల్ టైమర్సుకు స్వంత ఇళ్ళు ఏర్పడి, గేదెలు వగైరా పెట్టుకొని ఆర్థికంగా బలపడవచ్చునని ఆలోచించారు. పైగా అందరు కామ్రేడ్స్ ఒకే ప్రాంతంలో ఉండటంవలన రక్షణకూడా ఉంటుందని భావించారు.

ఎకరాల లెక్కన 12 ఎకరాలు కొన్నారు. ఈ సందర్భంలో మేము వాల్గు ఎకరాలు అమ్మివేసి ఆ డబ్బుతో రెండున్నర ఎకరాలు తీసుకున్నాము. ఇందులో మేము కొద్ది భాగం మాత్రం ఉంచుకొని మిగిలినదానిని ఇతర కామ్రేడ్సుకు కొన్న ధరకే ఇచ్చివేశాము.

మా పెండ్లి జరిగిన 50వ వార్షికోత్సవానికి గుర్తుగా (1987) నేను పార్టీకి 1116 ర్లు, విశాలాంధ్రకు 1116 ర్లు కానుకగా ఇచ్చాను. 10 కిలోలు లడ్డు తెప్పించి పంచాము. ఆ సందర్భంలో విశాలాంధ్రలో ప్రచురించడం కొరకు నేను ఒక లేఖ వ్రాయడం జరిగింది. అందులో మేము చేసిన త్యాగాలను గూర్చి ఉదహరించాను. అప్పుడు సి.ఆర్.గారు నా లెటరు చదివి చించివేశారు. “మనం చేసిన త్యాగాలను మనం చెప్పుకోకూడదు. అది మన కర్తవ్యం, ధర్మం అని భావించా”లని నాకు నచ్చచెప్పారు.

ఢిల్లీలో మేమున్న రోజులలో ఒకసారి ఆయన ఏ రాష్ట్రానికో టూరు వెళ్ళబోతున్నారు. ఆయన చొక్కా వెనుకవైపునున్న ముడతలు చూచి బాగా లేదన్నా. “వాళ్ళు నా చొక్కా ముడతలు చూడరు నా పనిని చూస్తారు” అని జవాబుచెప్పి అలానే వెళ్ళిపోయారు.

ఢిల్లీలో మా ఇంటిప్రక్కన ఒక ముసలి బిచ్చగాడు తిరుగుతుండేవాడు.

* ఒక మనిషి అతి సాధారణంగా చేసే చర్యలు జాగ్రత్తగా గమనించండి. అవి మీకు ఎన్నెన్నో విషయాలు తెలియజేస్తాయి. గొప్పగొప్ప వాళ్ళ నిజమైన నడవడిని తెలియజేస్తాయి. - వివేకానంద

అతనిని అడిగి సంగతులన్నీ తెలుసుకున్నారు. అతనికి ఎవరూ లేరు. ఒంటరిగాడు. అతనికి బట్టలు ఇచ్చేవారు. ఇంట్లోకి పిలిచి టిఫిను, టీ ఇచ్చేవారు.

చాలామంది వృద్ధులు రాజేశ్వరరావుగారి దృష్టిలో నిరాధారుల క్రిందనే లెక్క. వృద్ధాప్యభారానికి తోడు స్వార్జితంకూడా లేని వారి స్థితి మరింత దుర్భరంగా ఉంటుంది. బహుశా! అందుకేనేమో వృద్ధులంటే అయనకు అంతటి ప్రేమానురాగాలు.

ఆ రోజుల్లో మనుషులు లాగే రిక్షాలు ఉండేవి. వాటిని ఎక్కేవారు కాదు. సాధారణంగా నడక అలవాటు. ప్రజాశక్తినగర్ నుండి విశాలాంధ్రకు ఎప్పుడూ నడిచే వెళ్ళేవారు. సైకిల్ రిక్షావారికి అడగకుండానే అదనంగా ఇవ్వడం అలవాటు.

మేము బెజవాడలో ఒక చిన్న ఇంటిలో ఉండగా, గుంటూరు జిల్లానుండి జబ్బు చేసిన ఒక కామ్రేడ్ వచ్చాడు. తీవ్రమైన అంటువ్యాధి. నన్ను, పిల్లవాడిని ఊరికి పంపించి ఆ కామ్రేడ్‌ను మా ఇంటిలో ఉంచారు. ఆ తరువాత ఆ కామ్రేడ్‌వాడిన మంచాన్నికూడా డాక్టరు అచ్చమాంబగారు తగులబెట్టించారు.

స్వరాజ్యం భర్తకు కామెర్ల జబ్బు వస్తే మా ఇంటిలోనే వసతి కల్పించాము. మా పాలేరుగా ఉన్న స్వామేరుకు మూర్ఛలజబ్బు ఉండి ఒకసారి బాగా దిగజారి పోయాడు. మేము వాడుకునే మంచంమీద ఉంచి స్వయంగా పరిచర్యలు చేశారు. నాతో చేయించారు.

మంతెనవారి పాలెం రాజకీయపాఠశాలలో జరిగిన ఒక సంగతి నాకు ఇప్పటికీ గుర్తు ఉంది. దుర్భా కృష్ణమూర్తిగారి పిల్లవాడు ఎర్రగా, బొద్దుగా ఉండేవాడు. అందరూ ఆ పిల్లవాడిని ఎత్తుకొని ముద్దాడేవారు. పెండ్యాల లోకనాధంగారి అబ్బాయి కంటికి ఇంపుగా లేకనేమో, పెద్దగా ఎత్తుకునే వారుకాదు. రాజేశ్వరరావుగారు మాత్రం ఆ పిల్లవాడిని ఎత్తుకొని ఆడించేవారు. ఆ పిల్లవాడి కొరకని ప్రత్యేకంగా కొంత టైము కేటాయించుకునేవారు. ప్రత్యేకించి ఇలా ఎందుకు చేసినట్లు? ఏ రూపంలోనైనా "తక్కువ" అనుకునే వారిని ఎక్కువగా ప్రేమించడం

* మనం మన మాటలద్వారా కన్నా జీవితంద్వారా గొప్ప ప్రసంగం చేయగలం.
- గోల్డ్‌స్మిత్

ఆయన స్వభావం అనుకుంటా. ఇలాంటి లక్షణం కమ్యూనిస్టులకు అవసరమనుకుంటాను.

వ్యక్తిగతమైన తన స్వంతఖర్చులకు పార్టీ డబ్బును వాడేవారు కాదు. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా సి.ఆర్.గారు కొద్దికాలం ఉన్నారు. ఆకాలంలో తనకు వచ్చిన జీతం వగైరాలను మొత్తంగా పార్టీకి జమచేసేవారు. ఆఖరుకు తన అవసానదశలో నిమ్స్‌లో ఉన్నప్పుడు సహితం తనమూలంగా పార్టీమీద భారం పడకుండా చేయాలని తాపత్రయపడ్డారు.

సి.ఆర్.గారి స్వభావం ఆడంబరాలను, విలాసాలను అంగీకరించేదికాదు. తనుపెట్టే ఖర్చులుకూడా అలానే ఉండేవి. కొడుకు పుట్టినప్పుడు 1 రూ||కు గజం సైనుగుడ్డకొని, నాల్గు చొక్కాలు చేసి పంపించారు. మా మేనమామలేమో సిల్కు చొక్కాలు పంపారు.

## మంగళాపురంలో.......

"ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే గదా" అనే సామెత ఒకటుంది. రాజేశ్వరరావుగారు ఎక్కడున్నా జన్మభూమి, మంగళాపురంను మర్చిపోయే వారు కాదు. గ్రామాభివృద్ధికి, గ్రామంలోని సమస్యల పరిష్కారానికి స్వయంగా కృషిచేసేవారు. క్రింది స్థాయిలో స్వగ్రామంలో గడించిన అనుభవం, ఆయన విలువైనదిగా భావించే వారనుకుంటాను.

రోడ్డుమీద బస్సు దిగిన తరువాత (లక్ష్మీపురం) మంగళాపురం రెండు కిలోమీటర్ల దూరం ఉండేది. బాటంతా నీళ్ళు బురదతో ఉండేది. గ్రామంలోని ఎద్దుల బళ్ళను పోగుచేసి మట్టిరోడ్డు పోయించారు. ఆ తర్వాత జిల్లాబోర్డుకు పిటీషను పంపి, పక్కారోడ్డు నిర్మించేలా చేశారు.

పొలాలకు వెళ్ళే దారిలో ఇబ్బందికరంగా ఉన్నచోట, వరికోడు వంతెనను నిర్మింపజేసారు. ఆ తరువాత ఒక మురుగు కాలువను తవ్వించి, కృష్ణలో కలిపారు. జిల్లా పరిషత్ ద్వారా ప్రయత్నించి, గ్రామంలో హైస్కూలు ఏర్పాటు చేయడానికి నలుగురిని సమీకరించి జయప్రదమయ్యారు.

గ్రామంలోని వారికి వైద్యసౌకర్యం బొత్తిగా లేకుండా ఉంది. తీవ్రంగా కృషిచేసి హాస్పిటలును మంజూరు చేయించారు. ముందుగా హాస్పిటల్‌ను

---

* ప్రవర్తనలోను, అలవాట్లలోను, జీవితవిధానంలోను అన్ని విషయాలలోను నిరాడంబరంగా వుండటమే శ్రేష్టతరమైనది. - లాంగ్‌ఫెలో

మాకొష్టంలో ఏర్పాటు చేసారు. ఒక డాక్టరు నర్సు ఉండేవారు. ఆ తర్వాత హాస్పిటల్ పంచాయితీ ఆఫీసుకు మార్పించారు.

ఒకసారి, చుట్టుప్రక్కలనున్న పాలెములలో కలరా, మశూచికం వచ్చింది. ప్రజలు భయభ్రాంతులయ్యారు. అన్న రామలింగయ్యగారితో కలిసి డాక్టరును పిలిపించి పాలెములు తిరిగి, చికిత్స చేయించారు.

మా ఊరిలో ఒకసారి యాదవుల ముత్రాసుల ఇళ్ళు తగులబడి పోయాయి. దీనిమీద అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావుగారితో మాట్లాడి ఆరువందలు పక్కా ఇండ్లు శాంక్షను చేయించారు. ఇతర చోట్లనుండి వచ్చిన వడ్డెరలకుకూడా ఇళ్ళు శాంక్షను చేయిస్తే గ్రామంలోని ఇతర పేదలు పేచీపెట్టారు. వారికి నచ్చచెప్పి ఆటంకం లేకుండా చేశారు. కమ్మవారిలో ఉండే పేదలకు కూడా ఇళ్ళ స్థలాలు ఇప్పించారు.

* * *

---

* గొప్పనదులు ధ్వని చేయవు. - టర్కీ దేశపు సామెత

# ముగింపు

సి.ఆర్.గారికి అతిశయోక్తులు చెప్పడం ఇష్టం ఉండదు. ఉన్నది ఉన్నట్లు చెప్పడం ఆయనకు మొదటినుండీ అలవాటు. వారిని గురించిన నా ఈ "జ్ఞాపకాలను" మీకు చెప్పటంలోకూడా, ఏ మాత్రం అతిశయోక్తులు దొర్లకుండా చివరవరకు జాగ్రత్తపడ్డానని మనవి చేస్తున్నాను.

57 సంవత్సరాల సుదీర్ఘమైన మా దాంపత్య జీవితానికి, 1994 ఏప్రిల్ 9వ తేదీన శాశ్వతంగా తెరపడింది. వారు నామీద కోపగించుకొన్న సందర్భాలు లేకపోలేదు. దీర్ఘమయిన ఎడబాటులను, కఠినమయిన బాధలను చవిచూచాను. అయినా వారిని అర్థం చేసుకుంటానికి ప్రయత్నిస్తూ సహధర్మచారిణిగా వారితో ప్రయాణం సాగించాను. నాకెంతో తృప్తికరంగా ఉంది.

నాకు కిడ్నీల సమస్యవచ్చి ఢిల్లీలో ఒకసారి నన్ను విల్లింగ్‌డన్ హాస్పిటల్ (ఇప్పుడది రామమనోహర్ లోహియా హాస్పిటల్) లో చేర్పించారు. భూపేష్‌గుప్తాగారు, తన చెల్లెలని వ్రాయించి అడ్మిట్ చేసారు. శ్రీ రాజ్‌నారాయణ్‌గారు మంచంమీద నా ప్రక్కనకూర్చొని చాలసేపు పరామర్శించారు.

మిసెస్ చంద్రరాజేశ్వరరావు అని బోర్డు ఉండటంచూచి, శ్రీమతి ఇందిరాగాంధీతో సహా గౌరవనీయులైన నాయకులు ఎందరో నన్ను పరామర్శించి, పోతుండేవారు. చంద్ర రాజేశ్వరరావుగారి భార్యను అయినందువలననే, అంతటి గొప్పవారు వచ్చి నన్నుచూచి పోతున్నారని తెలుస్తూనే ఉంది. ఏ భారతస్త్రీ అయినా ఇంతకంటే కోరుకునేది ఏముంటుంది?

మఖ్దూం భవన్, హైదరాబాదు.
తేది: 24-12-1997

చంద్ర సావిత్రీ దేవి

# మా అబ్బాయి మాటల్లో...

## నాకు తెలిసిన మా తండ్రిగారు

సి.ఆర్.ను గురించిన మా తల్లిగారి జ్ఞాపకాలు విన్న తర్వాత కొద్దిగానైనా నేనుకూడా చెప్పాలనిపించింది. వారికి సంబంధించి, నాకు బాగా గుర్తున్న రెండుమూడు సంఘటనలను మీముందు ఉంచుతున్నాను. మొదటినుండీ మాది యిద్దరు మిత్రులమధ్య సంబంధంగా ఉంటుండేది. పరస్పరం వివిధ విషయాలు చెప్పుకుంటూ ఉండేవాళ్ళం. నాకు వయస్సు వచ్చేకొద్దీ, దాని కనుగుణమయిన విషయాలను నేను అర్థం చేసుకునేలా విశదీకరించటానికి వారు ప్రయత్నం చేసేవారు. విసుగు లేకుండా నేను అర్థం చేసుకునేవరకు సహనంతో వ్యవహరించేవారు. దానివలన నాకు విషయాలను గ్రహించటానికీ, ప్రాపంచికానుభవం కలగటానికి తోడ్పడి చాలా మేలు జరిగిందని భావిస్తున్నాను.

ఒక విధంగా మాది కలిగిన కుటుంబం అయినందున ఏకసంతానం కావటంచే మొదటినుండి గారాబంగా పెరిగాను. అందరూ ప్రేమించే పరివారం కావటంతో కష్టం, సుఖం తెలియకుండా చిన్నతనం గడిచిపోయింది.

నాకు పది పదకొండు సంవత్సరాల వయస్సులో బెజవాడలో ఒక చిన్న ఇంటిలో ఉంటున్నప్పుడు మాకు ఒక గేదె ఉండేది. దాని మేతకొరకు పోయి జొన్నచొప్ప తేవాల్సి ఉండేది. రోజూ మా తండ్రిగారు పోయి తెస్తుండేవారు. ఏరోజు అయినా ఇబ్బంది ఏర్పడితే నేను తెచ్చేవాడినికాదు. శరీర శ్రమ చేయడం తక్కువని భావించేవాడినేమో. సి.ఆర్.గారు నన్ను వెంటతీసుకునిపోయి మంచి మంచి మాటలు చెప్పుతుండేవారు. పనిచేయటంలో తప్పులేదని నచ్చచెప్పేవారు. "మేత తీసుకవచ్చి గేదెకు వేస్తేగదా అది పాలిచ్చేది, మనం తాగేది" అని చెప్పేవారు. రానురాను నాలోకూడా మార్పువచ్చింది. ఒకరోజు చిన్నమేతమోపు తెస్తూ నెత్తిమీద

కాకుండా ఇబ్బందిగా ఉన్నా భుజంమీద పెట్టుకవచ్చాను. క్రమేణా అలవాటు పడ్డాను. శరీర శ్రమ మీద నాకు గౌరవం కలగడానికి ఆయన చేసిన కృషి ఫలించిందన్నమాట. ఇంగ్లీషులో "డిగ్నిటీ ఆఫ్ లేబర్" అనే భావన ఉద్దేశం ఇదేకదా అని అవగతమయ్యింది.

నేను మొదటినుండి శాకాహారిని. మాంసం ముట్టేవాడినికాదు. ఈ అలవాటు మార్చడానికి మాంసాహారం ఉపయోగం గురించి నాకు చెపుతుండేవారు. నేను కాలేజి చదువుకొచ్చేటప్పటికి ఇంగ్లీషు అర్థమవుతుందని ఎంగెల్సు వ్రాసిన "వానరుడి నుంచి నరుడు (From Ape to Man)" అన్న పుస్తకాన్ని చదివించారు. అందులో మాంసాహారం తినడంవలన ఆదిమానవుని శరీరం ఎలా బలిష్టమయింది, మెదడు పరిమాణం పెరిగి ఆలోచనా శక్తి ఎట్లా పెంపొందింది, శాకాహార సంపాదనకంటే మాంసాహార సంపాదనకు సమయం తక్కువ అవటంతో మిగిలిన సమయాన్ని ఎట్లా నూతన పనిముట్లను తయారు చేసుకోవడానికి ఆదిమానవుడికి ఉపయోగపడి పూర్తిగా పరిణామం చెంది ఆధునిక మానవుడుగా రూపొందాడో వివరించబడింది. నాకు సందేహాలు వస్తే వాటిని తీర్చడానికి ఆయనగారు సులభంగా అర్థమయ్యేట్లు చెప్పారు. ఇట్లా శాస్త్రీయమైన విషయాలను నేను అర్థం చేసుకోవడానికి ఆయన తోడ్పడేవారు.

దయ్యాలు, భూతాలు అంటె అందరిలాగే చిన్నతనంనుండి ఉన్న భయాన్ని, అపోహలను తొలగించటానికి అనేక విధాల ప్రయత్నించారు. పగటిపూట శ్మశానం వద్దకు తీసుకుపోయి చూపించారు. అక్కడకూడా చెట్లు చేమలు నేల మాత్రమే ఉందని, కట్టెలు కాలిస్తే ఎక్కడైన బూడిద అవుతుందని చెప్పారు. రాత్రిపూట దయ్యాలు ఉంటాయేమో అనే సందేహం ఉండనే ఉన్నది కదా. అందుకని రాత్రిచీకటిలోకూడా అక్కడకు తీసుకుపోయి, పగలు ఏమున్నాయో రాత్రికూడా అవే చెట్లు చేమలున్నాయి, ఇదంతా మన భ్రమవల్ల ఊహించుకుంటున్నామే తప్ప దయ్యాలు భూతాలు లేవని వివరంగా నచ్చచెప్పారు.

నాకు చిన్నప్పుడు ఆయన చదరంగం ఆడటం నేర్పారు. నాకు మొదట దానిమీద అంత ఆసక్తి ఉండేదికాదు. అయితే ఇంటికి వచ్చినప్పుడల్లా నాతో ఆడుతుండేవారు. క్రమేణా నాకు దానిమీద అభిరుచి కల్గింది. బహుశా దీనివలన నాకు మెదడుకు పనికలిగి మానసిక

వికాసం పెంపొందుతుందని ఆయన అభిప్రాయం అయి ఉండవచ్చు.

పైవిధంగా శారీరక శ్రమమీద గౌరవం కల్గించటం, దయ్యాలు భూతాలు అనే అనవసరభయాందోళనలను పోగొట్టడం, మడికట్టుకొని మాంసాహారం ఎడల ఉన్న విముఖతను తొలగించడం, పనికట్టుకొని చదరంగం నేర్పించడం – వీటన్నింటిద్వారా ఆ తర్వాత జీవిత పోరాటంలో జయప్రదం కావటానికి ముందుగా వేసిన పునాదులుగా అర్థం చేసుకుంటున్నాను.

## ఉన్నతమైన మానవతామూర్తి

సి.ఆర్.గారి వ్యక్తిత్వాన్ని గురించి నాలో కలిగిన భావాలను మీ ముందుంచుతున్నాను.

ప్రప్రథమంగా నాకనిపించేది ఏమంటే ఆయన మానవత్వం మూర్తీభవించిన వ్యక్తి అని.

ఎప్పుడూ ఆయన తన పనులు తానే చేసుకునేవారు. తనవల్ల ఇతరులకు అదనపు శ్రమ ఇవ్వడం నచ్చేది కాదు. తానుమాత్రం ఇతరులకు నిరంతరం సేవ చేస్తుండేవారు. ఇతరులు బాధపడుతుంటే చూసి సహించేవారుకాదు. దగ్గర ఉండి సేవచేసేవారు. ఒకసారి క్షయతో బాధపడుతున్న ఒక యు.పి. కామ్రేడ్‌ను (మద్రాసులో ఉండగా) మా ఇంటిలో ఉంచుకుని పరిచర్య చేశారు. అవసరమైన ఏ పనిచేయడానికైనా న్యూనతాభావం ఉండేదికాదు.

పేదలను గూర్చి చివరిదాకా ఆలోచిస్తూ ఉండేవారు. వారికి తీవ్రమైన జబ్బులు వస్తే వైద్యం ఏమి జరుగుతుందని అంటూండేవారు. ఈ సందర్భంగా కుటుంబసభ్యులద్వారా తెలిసిన విషయం ఒకటుంది. తమ తల్లిగారి తద్దినం కాశీలో పెట్టమని వారి తండ్రిగారు కోరితే ఆ డబ్బు పేదవిద్యార్థులకు ఇవ్వడం, తండ్రి అడిగితే పెట్టలేదని ఆ డబ్బు పేదలకిస్తే పరలోకాల్లో లభించే పుణ్యం ఇక్కడే లభిస్తుందన్నారట. అట్లాగే గంగాజలం తెమ్మని కోరితే, నీటిలో ఏమి తేడా ఉంది, కృష్ణనీరు

---

* గొప్పవ్యక్తులు ఎప్పుడూ ఆశయాల కోసమే జీవిస్తారు. కాని బలహీనులు ఎల్లప్పుడూ ఆశలకోసమే జీవిస్తారు. – చైనా సామెత

కూడా  ఒకటే కావాలంటే చెంబుతో తెస్తానన్నారట.

మేము మద్రాసులో ఉన్నపుడు ఎపుడైనా విందు భోజనాలయ్యాక ఎంగిలి విస్తర్లు బయట పడవేస్తే, వాటిలోని మిగిలిన పదార్ధాలను అభాగ్యులు ఏరుకొని తినడం కంటపడుతుండేది. ప్రక్కన కుక్కలు తారట్లాడుతుండేవి. అలాగే ఇక్కడ కూడా జరుగుతుండేది. అలాంటి దృశ్యాలను చూసినప్పుడు సి.అర్. గారు చాలా వ్యాకులత చెందేవారు. ఆ పూట భోజనం చేయడానికి మనస్కరించేది కాదనేవారు.

సి.అర్.గారు ఎప్పుడూ నిర్భీతిగా, ధైర్యంతో వ్యవహరించేవారు. ఎవరితోనైనా ముఖస్తుతి  అతిశయోక్తులు లేకుండా, ఉన్నది ఉన్నట్లు ముక్కుకు సూటిగా నిర్మొహమాటంగా మాట్లాడేవారు. వ్యవహార సరళికూడా తేటతెల్లంగా దాపరికం లేకుండా ఉండేది. బంధుమిత్రుల ఎడల చాలా వాత్సల్యం  చూపేవారు. అందరితోనూ అంతస్తులు, తరతమభేదాలు, అరమరికలు లేకుండా కలిసిపోయేవారు.

వృద్ధులనుగూర్చి చాలా సానుభూతితో ఆలోచిస్తూండేవారు. జీవిత చరమాంకంలో అంతగా ఆధారం, ఆసరా, స్తోమతలేని వారి పరిస్థితి దుర్భరంగా ఉంటుంది, అటువంటి వారికి సమాజం ఏదైనా ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉందని చెప్పేవారు. పార్టీ సహచరులతోకూడ దీని సాధ్యాసాధ్యాలను గురించి  చర్చిస్తూండేవారు.

సి.అర్.గారికి పైకి కనిపించే అందచందాలమీద నగిషీలమీద దృష్టి ఉండేదికాదు. అంతకంటే  అంతఃసౌందర్యానికి ప్రాముఖ్యత ఇచ్చేవారు. వ్యక్తులు ఆర్భాటంగా, ఆడంబరంగా, డాంబికంగా  వ్యవహరించడం కాక, సమాజానికి ఉపయోగపడే మనుషులుగా ఉండాలనేవారు. విలాస జీవితం గడపటం  వ్యర్ధమని భావించేవారు. మనిషి మామూలుగా ఒడిదుడుకులు లేకుండా జీవితం గడపడానికి  అవసరమైన మేరకే ఏ వస్తువులనైనా సమకూర్చుకోవాలనేవారు. అలాగే ఆయన జీవితాంతం వరకు  సాధారణ జీవితాన్నే గడిపారు. అనవసర వస్తువులు ఏవి ఉంచుకొనేవారు కాదు. అసలు  వస్తుసేకరణమీదే దృష్టి ఉండేదికాదు, ఆఖరుకు దుస్తుల విషయంలోకూడా.

సి.అర్.  గారిది పూర్తి క్రమశిక్షణగల జీవితం. అలవాట్లన్నీ నియమబద్ధంగా ఉండేవి. అన్నింటిలోనూ  మితంగానే ఉండేవారు.

ఎంతటి బాధలనైనా, కష్టాలనయినా సహనంతో చైతన్యపూర్వకంగా భరించే శక్తి ఉండేది. "బహుజన హితాయ - బహుజన సుఖాయ" అనే బౌద్ధోక్తికి అనుగుణంగానే ఆయన ఎల్లప్పుడూ స్పందించేవారు.

అన్నింటికంటే జీవిత చరమాంకంలో - సమీపిస్తున్న మరణాన్ని చాలా ధైర్యంతో, స్థిరచిత్తంతో, నిబ్బరంగా, ప్రశాంతంగా, తాదాత్మ్యంతో ఎదుర్కొన్న తీరు నాకు ఆదర్శప్రాయమనిపించిశది. ఆయనగారి పరిస్థితిని చూచి, నేను మాతల్లిగారు దిగులు పడి ఉంటే మమ్మల్ని ఊరడించి, కఠోపనిషత్తులో ఉన్న "జాతస్య మరణం ధృవం" అన్న సూక్తిని ఉదహరిస్తూ చెప్పేవారు. మరణంకూడా జీవితంలో ఒక భాగమని, అది ప్రకృతి ధర్మమని చెప్పేవారు. మనకు తెలిసిన పెద్దవారెందరు పోలేదు? పరిపూర్ణ జీవితం గడిపి తాను చేయవలసిన పనులను శక్తిమేరకు నెరవేర్చిన తరువాత, వృద్ధాప్యభారంతో పూర్తి అశక్తత ప్రాప్తించినపుడు ప్రతిమానవుడు సమాజానికి భారం కాకుండా దాటిపోవడం మంచిది. దీనికొరకు ఎక్కువ పరితపించడం కూడదని మాకు మనోనిబ్బరాన్ని, ధైర్యాన్ని కలిగిస్తూ ఆయన ఈ లోకంనుండి శాశ్వతంగా వెళ్ళిపోయారు.

మొత్తంగా చూస్తే ఆయన భగవద్గీతలో వర్ణించబడిన స్థితప్రజ్ఞుడిగా నాకనిపించారు.

మఖ్దూం భవన్,
హైదరాబాద్.
తేది: 25-12-1997.

చంద్ర చంద్రశేఖర అజాద్

★ ★ ★

మరణించడానికి సిద్ధంగా వున్నవాడే స్వేచ్ఛగా జీవించగలడు. - గాంధీజీ

